Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక
అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
బ్రకటింపబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జనపాడు.

సంపుటము 7 | 1915 నవంబరు | సంచిక 11

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 సంచాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహదరు జమీందారులు, నూజవీడు

2 రాజా వెంకటాద్రి అప్పారావు బహదరు జమీందారుగారు, నూజవీడు.

3 రాజా వాశిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహదరుమన్నె సుల్తాన్ జమీందారుగారు ము,క్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామలింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు.

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోల్లేరు.

8 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 తొర్లకొండ హనుమంతరెడ్డిగారు లోలంపగైరాసేగ్దారు, తొర్లకొండ.

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 నైవధము సీతాకాంతముగారు మోరంపూడి

7 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి

8 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యూడవరము.

9 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

10 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

11 నరసింహారెడ్డి దేశాయిగారు, కాసరబ్బాద

12 రాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట

13 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజర్లంపాడు.

14 వెలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల

# అభినవ సరస్వతి

సంపుట 7 { జానపాడు | రాక్షస సం॥ కార్తీకమాసము } సంచిక 11

## శృంగారతిలకము

కాళిదాసునిచే రచియింపఁబడిన శృంగారతిలకమును బలువురు సుప్రసిద్ధకవు లాంధ్రీకరించియుండిరి. మూలానుసారముగ నిదివఱకున్న యాంధ్రీకరణములతో నాంధ్రభాషాసతి తృప్తినందెఁగాని కవితావ్యాయామమునను ప్రతిభాషాసేవకుఁడు క్రమ్మఱఁదెల్గించి తెలుఁగున కూడిగమొనర్ప మానుటలేదు. అట్టివారిలోఁ గృతార్థతములు శ్రీగంపలగూడెము కుమారరాజావారగు శ్రీకృష్ణారావు బహద్దరువారు. వీరు యౌవననిగ్రహణము, అభినవపాండవీయము, లోనగు పొత్తములొనర్చి యాంధ్రభాషాంగన మన్ననఁగాంచినవారు. వీరికవితానైపుణ్యమునకుఁ గవులు రసజ్ఞులునిదివఱకె తలలూఁచియున్నారు. ఇట్టివిద్యావేత్తలు ప్రకృతశృంగారతిలకవిరచనమున విజయ మొందిరని, కృతార్థులైరని, వాకొనుట పునరుక్తికాకపోదు. ఆంధ్రీకరణము నిజముగఁ గష్టసాధ్యము. అట్టిపద్యములుఁగూడ స్వతంత్రపద్యములవలెం దీసిపోకుండ వ్రాయుట మానవశక్త్యతీతము. ప్రకృతపు శృంగారతిలకము మూలమునకు సరిగ్గానె స్వతంత్రముగ రచియింపఁబడినదానిఁబోలి ముద్దుల గురిపించుచున్నది. బహుకార్యధురంధులును సహజ సుకుమారులునగు నీకుమారరాజావారు మాతృభాషాగౌరవముచే నిట్టియుత్తమ గ్రంథమాంధ్రీకరించి శాశ్వతకీర్తిఁ గడించిరి. రచనానైపుణ్యముఁ జూపుటకుఁ గొన్ని పద్యములవ్రాసి మూలముతో సరిచూపి యాంధ్రమహాజనులకు నివేదింతుము.

శ్లో॥ హేరోహిణి? త్వమసిరాత్రికరస్యభార్యా।యేనం నివారయ పతింసఖి? దుర్వినీతం। జాలాంతరేణ మమవాసగృహం ప్రవిశ్య।శ్రోణీతటం స్పృశతికింకులధర్మయేవ॥

ఉ॥ రోహిణి? నీకుఁ జంద్రుఁడు వరుండగుఁ గావున వేగమీ గురు
ద్రోహిని దిద్దుకొమ్మ; చెడుత్రోవలఁ బోవిడకమ్మ! రేలనీ
సాహసి నాగృహంబునకు జాలపథంబున వచ్చి నాకటిన్
బాహులనంటుచుండు సుగుణంబగునే! యిదివంశధర్మమే॥

ఈపద్యమునఁ గవిగారు చమత్కారప్రాసనుంచికొనియు మూలమునందలి రసము ను జక్కఁగఁబోషించిరి. అంతియకాక మూలమందలి రసమునుగూడఁ దెల్గునఁ జక్కఁగనించిరి

శ్లో॥ కింమాంనిరీక్షసిఘటేన కటస్థితేన।వక్త్రేణ చారుపరిమీలితలోచనేన
అన్యంనిరీక్ష్యపురుషంతవభాగ్యయోగ్యం। నాహం ఘటాంకితకటిం ప్రమదాంభజామి॥

ఉ॥ నాకయి ముద్దుఁగారు వదనంబున నేల? తదేకదృష్టి నో
టీ? కను ఱెప్పలార్చుచుఁగటిస్థలిభాండముఁదాల్చి చూచెదే?
నీ సుసమానుఁడైనయొకనిన్ వరియింపఁగఁబొమ్మ! కాని, నే
నా? కటిబిందెకల్గుగతికా? కల్లనైననొనర్ప నాస్యమున్॥

ఈపద్యముమాలను నించుక యతిక్రమించినను మాలాధరఘటితమై మనోహరముగ ముద్దుగారుచున్నది. విమర్శింపమొదలిడిన నీగ్రంథమున విడచిపెట్టఁదగిన పద్యమొక్కటేనియు లేదు. ఇట్లె భాషాసతి కలంకరణములఁ బెక్కులొనర్చి యాంధ్ర భాషాప్రపంచమునకు మేలొనగూర్చుటకు నీమహామహులకు భగవంతుఁడాయురారోగ్యము లొనర్చి రక్షించుఁగాక. ఈగ్రంథమువలనియున్న వారల కుచితముగ నొసంగుటకు శ్రీకుమారరాజావారు సిద్ధసంకల్పులయి యుండిరని పత్రికాపాఠకులకు విన్నవింపఁ గలందులకు సంతసించుచున్నారము.

# అభినవపాండవీయ

## పరిదర్శనము.

శా॥ శ్రీలీలాకరణంబు, మంజులయశస్సీమంతినీ భూషణం
బాలీనాఘవిదారణంబు కవితావ్యాసంగ సంగార్భటీ
శైలీద్యోతకమైన శ్రీహరికృపాకృష్టప్రభల్ వేయిచం
దాలన్ బ్రోచునుగాత కోటగిరికృష్ణారాయ భూపాలునిన్॥

చ॥ జలరుహకర్ణికాస్థలిని సమ్మతిమై వసియించి తేఁటిమ్రోఁ
తలకును దోడు వీణెఁగొని తంత్రులమీటుచుఁ బారవశ్యమున్
జెలువునఁ జెందఁజేసి కవిశేఖరులన్ దయతోడఁ జూచు ధీ
బలవతి వాణి కృష్ణనరపాలుని కైతను వృద్ధిఁజేయుతన్

చ॥ అభిరతి కృష్ణరాయనృపు నట్టులఁ గైత రచింప నేర్చి యీ
యభినవపాండవీయము బుధాగ్రణులౌనఁగా రచించి ధీ
ప్రభ చెలువారి నాంధ్రమును రాజిలఁజేసిన యీనృపాలు నే
మభినవకృష్ణరాయఁడని యాడినసందియమొందు కల్గునే॥

మ॥ అలఘుప్రాభవమూర్తులై చెలఁగు సుబ్బాంబా జగన్నాథరా
యల పుణ్యంపుబలంబొ? భవ్యతరవిద్యాకామినీ సత్తపః
ఫలమో? కాదగుకృష్ణరాయనృపు సద్భావంబు కానున్నచో
నలఘుప్రాభవమున్ కవిత్వకలనా వ్యాసంగమున్ గాంచునే॥

సీ॥ పరసతికై యాసపడుదురే కీచకమరణవార్తఁ గనుగన్న సరసమతులు
స్వైరిణీవృత్తికిఁ జనుదురే ద్రౌపదీ స్థిరబుద్ధిఁ గనిన సుశీలవతులు
ఇతరసుఖములకేస్తురే యింకమీఁద రారాజు వెతఁగన్న రాజ్యపతులు
ధర్మమే జయమని తలపక పోదురే ధర్మజామతిఁగన్న ధైర్యమతులు
తే॥ గీ॥ భావమనుసంఘమునకు లోపంబుఁదీర్చ । ననఁగ జంకుదుశ్శోనేఁటియాటఁగనిన
ధన్యులెల్లరు శ్రీకృష్ణధారుణీశుఁ । జతురమతులార యుత్తమసభ్యులార॥

ఉ॥ నాటకశాలవృద్ధినిఁ బొనర్చినయందుకు నర్తకుల్, కళల్
పాటిలురీతి నాటకము వ్రాసినయందుకు సత్కవుల్, మదిన్
నాటఁగనీతిగాథను నొనర్చినయందుకుఁ బ్రేక్షకుల్, యశః
పాటవమూర్తి కృష్ణనగపాలుఁ గృతజ్ఞతమైఁ గనందగున్

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.



# లలితాంబాశతకము.



క॥ శ్రీనారాయణుఁ డంశజుఁడై నహాయుగ్రీవదేవు నతిభక్తినిదా
మానుగఁగన్గొని కుంభజమౌని వరుండడిగె వేడ్కమదిలలితాంబా! ॥

క॥ లలితాదేవ్యర్చనము లుపాయములుపుగ(ను స)హస్రనామములుజపవిధులిం
పౌలయఁగ దెల్పుమటంచును సలలితమతినతఁడు నుడ్వెనంగ లలి॥ 2

క॥ తత్ర బ్రహ్మాండపురాణస్థుఁడై బ్రహ్మాదిదివ్యసేవ్యంబుగ నం
చితసరణి సుప్రాప్త పరమాత్మ్యతకథవివరించె(మోద)మున లలి॥ 3

క॥ హ్రీంకారసుమధ్యవాసిని! కుంకుమ (మృదుపంక) లిప్తకోమలదేహా!
పంకజము (ఖ్యాసను) ద్భితి! శాంకరి! నను బ్రోవు శిఖరిజా లలి॥ 4

క॥ కోమలబింబాధరోష్ఠి! కామేశ్వరుదేవి! నిత్యకల్యాణి! రమా
భామేశసోదరీ! యని వేమారునుతింతు నిన్ను విను లలితాంబా!॥ 5

క॥ తొల్లిఁ గాసురాసురుఁ డొప్పవరబలయుతుఁడై శక్రుఁడోలి స్వర్గంబున క
త్యలఘుతరనాయకుఁడై కొలిమిసదా నేలఁబూనెఁగా లలి॥ ౬

క॥ ఆయింద్రవైరిసేనయు మఱియుఁ ఘుదం(బునను మొదల)మృత్యువగుచుఁ స్వే
చ్ఛాయుతుఁడై చరించె నపాయంబెఱుఁగకయ గర్వపడి లలి॥ 7

క॥ అంతట దేవావళి నిను చెంతఁ బిలిచి మ్రొక్కులిడినఁ జెనటిదనుజులన్
బంతమెలర్పఁగఁ ద్రుంచిన చింతామణి (వీవుగాదె) శ్రీలలి॥ ౮

క॥ ఈ సర్వభువనముల సంత్రాసంబెడఁబాపి సౌఖ్యదాయి(నివౌ) ని
శ్శేసరియగు దైవంబు లనాసిగ నేనెచటఁగాన వర లలి॥ 9

క॥ నీలసరోరుహజాలా! బాలేందుసమానఫాల! పద్మా(క్షీ) రతి
లోలకోదండసుందరభ్రూలత! యని నిన్నుఁ బొగడకో లలి॥ 10

క॥ ఫుల్లచాంపేయనాసిక! పల్లవరుచిరోష్ఠ! కుందపంక్తిరదన! ప
ద్మోల్లసదంబక! శంకరవల్లభ! (మృదు)కీరవాణి! వరలలి॥ 11

క॥ దర్పణకపోలయుగ! కం|దర్పవిజయశంఖకంఠ! ధరవక్షోజా!
సర్వో(త్తమవేణీ)యుత! నేర్పరి భూతేశభామినీ! లలి॥ 12

క॥ లోకభరణాత్మతుందా|స్తోకా! వర్తులసునాభి! సురపథమధ్యా!
భూకటి! రంభోరుద్వయ! శ్రీకరమణిజానుయుగళ! శివ! లలి॥ 13

క॥ కాంచనకాహళజంఘిక! వంచితసత్కూర్మపాద! వరకుంకుమపం
కాంచితచరణతలా! యని|కొఁచక మదిఁ గొల్తు నెపుడు గురులలి॥ 14

క॥ రంగత్కనకాంచితవల|యాంగదకేయూరరత్నహారాదిమహా
త్తుంగన(కలా)ంగభూష! ర|థాంగనిలయభర్మవసనధర! లలి॥ 15

క॥ ఈకరణినీమదివ్య శు|భాకరరూపంబు మస్తకాది పదాంతం
(బేకాగ్రవృత్తనెరఁగు)న|దాకృతి దా సుకృతియగుఁగదా లలి॥ 16

క॥ శ్రీ(మిళితోంకృతి)పంజర|ధామశుకీ! యుపనిషత్సుతరువనకేళీ
ప్రేమకలకంఠి! యోగమ|కోమలవిపినాళిబర్హి! గురులలి॥ 17

క॥ శ్రీమత్సుధాంబునిధి(ఁగల|యా)మంగళ(కరపుఁగడిమియడవి నెఁస)గు
చిం|తామణిసింహాసనమున|సోమాయుతకాంతిమించు సుఖి లలి॥ 18

క॥ శ్రీమచ్చిదగ్నికుండిక|క్షేమంకరలీలఁబుట్టి శ్రీచక్రరథం
బేమరకయెక్కి సోముని|తో ముదమునఁగూడియుండుదువు లలి॥ 19

క॥ విధవిధుధరముఖులకు| వధియింపఁగనలవికాని పలలాశనులన్
మథనముగావించిననీ| కథలను బేర్కొనఁగ లేరుకద లలితాంబా!॥ 20

క॥ సర్వప్రపంచజననివి| సర్వాభీష్టప్రదానసమధికగుణవా
సర్వేశార్థాంగివియా| సర్వ (జగతి) నీకు నెవరుసరి లలితాంబా!॥ 21

క॥ రాజీవాక్షసహస్రసి| రాజితభవదీయ (మూర్తి) రమణానుతింపన్
రాజధరసఖజనిర్జర| రాజగురులకైనఁదరమె రహిం లలి॥ 22

క॥ స్థావరజంగమములకు స| దావరణంబీవెకా దయన్ మదనపున
ర్జీవప్రదాన! శాంకరి! దేవీ! సేవింతు నామదిని లలి॥ 23

క॥ భాను సితభానుయుగ్మము|మానఁగఁదాటంకఘటితమణులంచును వి
న్నాణముగు తారకావళి| నీనఖములఁటంచు బుధులనిరి లలి॥ 24

క॥ నారాయణ(రూపదశక।మూ)రయునీకరరుహములయం దుదయంబై
సారతరమయ్యె భూస్థలి।సారసదళనేత్రి! శంభుసతి! లలి॥ 25

క॥ శ్రుతికాంతాసీమంతాం। కితసిందూరంబు తావకీనపదాబ్జో
న్నతధూళిగాదె నేసం। తతమభివందనముఁ జేసెదను లలి॥ 26

క॥ పంచాశద్వర్ణంబు లు। దంచిత(మగు)నీ(దు)పాణి నక్షసరంబో
పంచాననార్ధదేహా! పంచాననగామి! (క)ను కృపన్ లలి॥ 27

క॥ రాకాసుధాంశుబింబము। జోకంగన్పట్టుముఖము సురచిరచంద్రో
త్సేకమునఁదోఁచునగవు స। దాకోరిక నేస్మరించెదను లలి॥ 28

క॥ రఁగద్భుజంగపుంగవుఁ। డంగదమంజీరవలయహారాదిమహో
త్తుంగ(వర) భూషణంబుల। సంగతిఁదగె నీదయావశత లలి॥ 29

క॥ ఘనఘనచికురావళి పెం। పెనయన్ శిశుచంద్రకాంతినీనుదురు శ్రీ
లనఁదగిన కర్ణయుగళము।కనులు వెల్లదమ్మిపూలుగద లలి॥ 30

క॥ కామేశబద్ధమాంగ। ల్యా! మధుకరపారవేణి! లావణ్యఖనీ!
దామోదరసోదరి! ని। త్యామోదిని! దోషతిమిరహారి! లలి॥ 31

క॥ స్ఫురద(గ్ని జ్వాలా)వళి।కరమొప్పఁగఁగంఠమాలిక(గఁదాల్చుచు)ను
ద్భురవహ్నిప్రాకారాం। తరమునవసియింతువీవు తగ లలి॥ 32

క॥ లలిమూలాధారాంబుజ।నిల(యు! య) జగ్రంథిభేదినీ! మణిపూరో
జ్జ్వలమధ్యస్థలవాసిని! బలివైరిగ్రంథిభే(ద)పర! లలి॥ 33

క॥ కాంతసహస్రారాబ్జని। శాం(త!యు) మృతసారవర్షసమధికసుగుణ
స్వాంతా! భక్తజనావన। శాంతదయాపాంగ! శూలిసతి! లలి॥ 34

క॥ వరఖట్వాంగముఖాయుధ। ధరపాణీ! విశుద్ధచక్రధామా! క్షీరా
న్నరతా! త్రిలోచని! ని। న్వెఱువొలఁగఁగొల్తు ఢాకినీ! లలి॥ 35

క॥ సుమహదనాహతకమల। స్థ! మహావీరేంద్రపరివృత!ముఖద్వయ! నీ
కమలాంఘ్రులుగొల్తుఁదగ।న్విమలతననుఁబ్రోవు శాకినీ! లలి॥ 36

క॥ భజియించెదమణిపూ। రాంబుజసంవాసిని!గుడాన్నభుక్తిప్రియ! కా
మజనకసోదరి! నేనిఁక। నిజముగమదిఁగొల్తు లాకినీ! లలి॥ 37

క॥ లలి స్వాధిష్ఠానాంబుజనిలయా! దధ్యన్నమోదవ! నిర్మలమణిక్ర
ద్వలయా! యని భవదంఘ్రుల నెలమిని సేవింతుఁ గాకినీ! లలి॥ 38

క॥ గురుతరమూలాధారస్ఫురుచిరపద్మస్థ! ముద్గభక్తప్రియ ని
న్నరమరలేక నుతించెద నిరుపమగుణ(యుక్త!) సాకినీ! లలితాంబా!

క॥ భావించిచూడ జగముల నేవేల్పులకైన దార్ఢ్యమీయను మతి యిం
కేవారు లేరు శివసతి! నీవే దిక్కుగద హాకిని! లలితాంబా! 40

క॥ సాహస్రదళ(మహాత్మ్యల)గేహా! సర్వాన్నభుక్తి! గిరిసుత! మృగరా
డ్వాహా! యని నినుఁగొల్చెద నిహారాద్రిభవ! యాకినీ! లలితాంబా 41

క॥ సర్వవ్యాధినివారిణి! సర్వాహితఖండనైకసదమలచిత్తా!
సర్వ(ప్రపంచ)పూర్వహా! ని(ర్వాహదఖిలార్థ!) శాకినీ! లలితాంబా॥ 42

క॥ విందుగఁ గైకొందువు మా కందాసవమెప్పు మనీవు కైలాసకుభృ
త్కందరమందిర! గొను నా వందనములు పార్వతీ! శివా! లలితాంబా॥

క॥ బాలా! పంచదశాక్షర లోలా! కరుణాలవాల! లూనాసురరా
డ్జాలా! సేలాళిసదృగ్వ్యాలా! నాళీకతుల్యపద! లలితాంబా!॥ 44

క॥ ఖద్యోతకోటికోటిసమద్యుతి! లీలా(సివహా) సమంజఖని! నిక్ష
(హృద్య) ముగ షోడశాక్షర విద్యానిలయా! యటందు విను లలి॥ 45

క॥ ఇభుప్రక్కలసురుచిరచామరములు చేఁదా(ల్చుచుఁ)రమ(యు)వాణి
శచీతరు(ణియు)నిను సేవింతు(రు)వరమొసఁగెదవంచు నాసపడి లలి॥ 46

క॥ భవ(దతి)మంజులరూపం బవలోకించుటకు నిర్జరాంబుజనేత్రల్
ప్రవిమలమతులై సీదగు భవనము(నకువత్తు) రిష్టపడి లలి!॥ 47

క॥ ఇలనిన్నుఁగొల్చుసద్భక్తులఁ(బ్రోతువు)(పృథుల) రోగకోటి దునిమి వ
జ్రలలితదేహముగాఁగను గలిదోషనివారణైకఖని! లలి॥ 48

క॥ వలనొప్పఁగ నినుఁగొలిచినఁ గలదే దారిద్ర్యమొందు, ఘనవిభవాఢ్యో
జ్వలుఁడై సమస్తముగు భూతలమేలుఁగ దానమునను తగ లలి॥ 49

క॥ నీపాదసేవనల్పిన బాపాళి నశించు దహనభస్మీకృతతూ
లోప(మ)ముగని(టు)త్రిజగద్వ్యాపకదక్షుతకు నీవె వరలలి॥ 50

తే॥ చంద్ర! జైవాతృకౌషధీశ్వరసుధాక
రప్రముఖనామములు నీకు బ్రహ్మ పొసఁగ
నొసఁగె నొసఁగెఁ దదర్థంబు లుర్వియందు
రసికులెన్నిన నేతిబీరపసరుగాదె॥ 194

తే॥ అమృతకరుఁడనిజగతి ని న్నాదికవులు
సరసచతురతఁబల్కిరి చందమామ!
ఆదివర్ణవిహీనమై యలరునేని
అదియ పాంథులపాలిటి కర్థమౌను॥ 195

ఉ॥ శాపమొగిన్ గురుండిడినఁ జండభుజంగము పట్టిమ్రింగినన్
దాపసనాథపాంథవనితా జనతావినతాక్షివారివా
హోపతితోద్ధతోష్ణ సలిలాశని పాతమునన్ శశాంక! నీ
రూపమణంగకున్న యది రోహిణి మంగళసూత్రమెట్టిదో॥ 196

ఉ॥ హా హరిణాంక! నిన్ హాలహలాభుని మ్రింగి హరింపలేక యా
రాహువు క్రమ్మఱన్ వెడలిరా వడిఁ గ్రక్కె, ననారతంబుగా
నాహరుఁ డెట్టు పొందుపడ నోఁడలఁదాల్చెనొ తుంగభంగసం
దోహసమగ్రశైత్యగతి ద్యోధుని జూటమునందు నుంటనో॥ 197

తే॥ పద్మినీమిత్రుఁడుండంగఁ బద్మవైరి
నిను గురుద్రోహిఁ గుటిలాత్ము నీచవర్త
నుని ననాథాంగనాహింసకుని ధరించె
భూతపతి శీర్షమునఁ దనబుద్ధిపోనె 198

సీ॥ బల్లప్పునెమ్మేన బాయక యొసఁగుట
సాంకృతితోడ మిన్నంటియుంట
సరవి మధుప్రియసంగతిగాంచుట
పాంథజనమ్ముల బాధలిడుట
పగలైనదెల్విగోల్పడి కానఁబడకుంట
నుగ్రశేఖరలీల నొప్పుగనుట

రాత్రి మహాహ్లాదవ్యాప్తి రంజిల్లి మొలఁగుట
శంబరవర్ధనోజ్వలతగనుట
మెఱఁగియుండియు నిన్న యో! సరసులెల్లఁ
గల్పితోక్తినిమరుగిడి ఘనత నేమొ
పచ్చిబోయ నిజంబని పలుకకిలను
రాజటందురు తెలియంగరాదు చంద్ర!॥ 199

తే॥ ద్విజనయనజాత! ద్విజరాజ! ద్విజవిభూతి
యణఁచినందునఁబో పర్వదినములందు
ద్విజము ద్విజపాళిఁ బట్టి నీ తేజమణఁచు
చెంతచేసినవారికి నంతగాదె 200

తే॥ కలశవారాశి త్రిజగముల్ కాల్చునట్టి
కాలకూటంబుగనిక నెఁగ్రమ్మఱంగ
హాలహాలతుల్యుఁగామినీ హాననునిన్ను
నీరజారాతి! తననిల్వనీరుగాను 121

తే॥ కలసిక్రీడించు జక్కవకవలను నెడఁ
బాపి తోఁబుట్టువుగృహంబు రూపుమాపి
మెలఁగ దోషాకరుండని పలుకఁదగదె
సభ్యవర్తననీకేడ చందమామ! 202

తే॥ లోనహరిణాఖ్యచే విషంబూనియుండి
పైఁబయిని జిల్గువెన్నెలఁ బర్వఁజేసె
దవు మృగాంక! గళంబునఁ దనరువిషము
రసన బెల్లంబుగాదె దుర్జనుల కెందు" 203

వ॥ అని పొంకపడ నిందిందిరవేణి చందమామను నిందించి,

—:మన్మథదూషణ:—

చ॥ చిగురుకటారు శాకొదమచిల్కలతేరు వియోగకోటికిన్
దిగులొనరించుపేరు తగఁ దెల్లనివేలుపుతోడిపోరు మేల్

వగఁగలతీరు పుల్గులదళంబులసౌరు పొసంగఁగల్గు న
య్యగణితశౌర్యసారుఁ గమలాలయ గన్నకుమారు మారునిన్. 205

వ॥ ఉద్దేశించి గంభీరమమకార చమత్కారంబులు గనంబడు
వాక్యంబుల నిట్లనియె, 206

ఉ॥ "మార! రమావధూప్రియకుమార! లసత్సుకుమార! కీరతు
షార! నిశాతపంచశరకంపితపన్నగహార! భూరిదో
స్సార! వివేకహార! ఘనశౌర్యవిశోషితపాంథలోకవి
స్తార! యిటు ల్మహోగ్రగతి సారసనేత్రఁ గలంపఁ బాడియే॥ 207

ఉ॥ భీమపరాక్రమస్ఫురణ భీముని గెల్చినవాఁడవయ్యు నీ
కోమలి ముద్దరాలబల ఘోరలతాంతశిలీముఖంబు లా
హా! మదిగాడనేయుటది న్యాయమె ధారుణి, రామరామ! యో
కాముఁడ! దోనపం డినుపకట్టులకోర్చునె యెన్నిచూచినన్॥ 208

ఆ॥ బాపుమదన! నీవు వాసిమై స్త్రీ బాల
గోల లీలఁ బూలకోల లేయఁ
బేర్మిఁబూనుటెల్ల బిచ్చుకమీఁద బ్ర
హ్మాస్త్రమేయఁబూను నట్లుకాదె॥ 209

తే॥ అన్నవైయుండి యయ్యయో! యాఁడుపడుచుఁ
దోడఁబుట్టువు నిబ్భంగి దుఃఖపఱచి
తిట్టుగుడుతురె మన్మథ! దీన నీకు
భూరికల్యాణవైభవస్ఫూర్తిగలదె॥ 210

చ॥ జలరుహబాణ! తావకనిశాతలతాంతశిలీముఖోజ్వల
జ్వలనశిఖాప్రతాపమున జాహ్నవి నొఁదలఁదాల్చి బూది మై
నలఁది పరేతభూమిగతుఁడై యటు తాళఁగఁజాల కాహలా
హలవిషమానె శంకరుఁడు హా! యిఁకనీదుప్రతాప మేమనన్"॥

వ॥ అని శశాంకముఖి మకరాంకు వేఁడుకొనిన నతండు ప్రస

న్నుండు కాకుండుటయెఱింగి యత్యంతరోష కషాయితనేత్రయై
యిట్లనియె.॥ 112

మ॥ "జలధిశాత్రిపత్రిప్రతులకు సంజాతత్వముంగాంచుటన్
బలుబీజుండన నొప్పుచందురునితో బాంధవ్యముంగన్న నీ
కలఘుశ్రీగుణమెట్లుకల్గు, నకటా డాహా! కాల్చెదో బుట్టువి
ల్లు, లయంబుం బొనరింపఁజూచితివిగా లోలాక్షి నీసోదరిన్॥ 213

సీ॥ మధుపగుణంబుచే మనునీకు జాతిఁబా
సినవానితోఁదగఁ జెలిమిగలిగె
తృణధర్మవృత్తిచేఁ బెనుపొందునీకు దో
షాకరసౌమనస్యంబుగలిగె
అసదృగున్నతవిగ్రహస్థితిగలనీకు
గురువనప్రియబలస్ఫురణగలిగె
పాంథవిద్వేషివై పరఁగిననీకుఁ బ్ర
భంజనుండు బలాధిభర్తగలిగె
అకటకట శంబరారి! ని న్నాత్మనెఱిఁగి
వేదజడుఁడౌటఁ గాలినవృత్తికోర్చి
ధాత దుస్సహావాసంబు తగులుపఱిచె
విరహిణీలోకదుర్దశాభరముగాదె॥ 214

చ॥ లలితనిజాత్మజారతికళాకలితాత్ముఁడు నీదుపూర్వజుం
డలజడవృత్తివాఁడు భవదంబనుగన్నగురుండు, బాపురే
తలఁపననాథయోషి దతిదారుణవిక్రమశాలివీవు, నీ
యిలువరు సేమిచెప్పనగు, నించుక హ్రీవలదేమనోభవా!॥ 215

క॥ కట్టడివగునీ వంగజ! యెట్టుజనించితివొ కరుణనెసఁగెడు శశితోఁ
బుట్టినచెలువకు హారికిని! గట్టా! విష మబ్ధిభవముగాంచినలీలన్॥

తే॥ విరహిణీమారణోపాయవృత్తినీవు
మెలఁగఁ గాంచి చతుర్ముఖుం డెలమి సార్థ

కముగనిడె మారుఁడనునామ మమరనీకు
మదన! కాకున్న నిన్నేల మారుఁడండ్రు॥ 217

సీ॥ హరివాహనుఁడనంచు నలుగఁబోకుము కరి
యాసపైఁ జిల్కహులుమాయిగాదె
అండజధ్వజుఁడనే నంచహిరోమాళి
బాధింప కది మీనుపడగగాదె
సారంగబలసముజ్జ్వలినంచురంభోరు
నళికింప కది తేఁటిదళముగాదె
అబ్జాంబకధరుండనంచుఁ దమోవేణి
దొరయకు మదితమ్మితూపుగాదె
మదన! యిది సంకుమదగంధి మదరథాంగ
ఘనపయోధర కోమలకనకపువ్వ
క్రమనాసిక కలహంసగమన దీనిఁ
జెనకి తేనియు నీదుసాధనము లణఁగు॥ 218

ఉ॥ హేమకరాంక! నీ శరశరాసనముల్ విరులంచు భూరివా
చామహితప్రభావమున సారెకుఁ బ్రాజ్ఞులు పల్కుచుందు ర
య్యో! మహిళాళి నేఁచుకొఱకుర్వి సుమాఃఖ్యల ధాత చేయఁబెం
పై మదియించు బల్విషగులంచువచింప రదేమి పాపమో॥ 219

చ॥ పిడుగుల కోర్వవచ్చు, పటుభీమలలాటకృపీటయోనికిన్
వడి నెదుటం దగన్ నిలువవచ్చు, ప్రచండకృతాంతదండమే
ర్పడ నొడియంగవచ్చు, బడబాజ్వలనం బొగి నంటవచ్చు, నీ
బెడిదఁపుఁబూపుటమ్ములకు భీతిలకే నిలరాదుమన్మథా!॥ 220

సీ॥ ఈచంద్రబింబాస్య నేఁచంగఁబూనకు
మోరోరినీశర మూఱ పూర!

ఈవనప్రియకంఠి నేఁచంగఁబూనకు
మోరోరి నీధర్మ మూఱ మార!
ఈకాంచనసునాస నేఁచంగఁబూనకు
మోరోరినీగుణ మూఱ మార!
ఈఘనాఘనవేణి నేఁచంగఁబూనకు
మోరోరినీబల మూఱ మార!
నెలతలనుబోలె మిక్కిలి చలముఁబూని
నెలతలనుదాల్చుకొన్నసామి లలినేఁచి
బేసికంటఁగనుంగొనఁ బేరణంగి
యవనిఁగూలవె నీరూప మూఱ మార!" ॥ 221

వ॥ అనియానారి శంబరారిం దూరి తరళలోచనకు గరళంబు చందంబునం గనుపట్టు మందగంధవహున కిట్లనియె॥ 222

గంధవహుని దూషించుట.

కం॥ పవనా! మలయమహీధరభవనా! భువనాద్భుతాదిబంధురభాస్వ
జ్జవనా! వర్తితసరోవ్ఫవనా! యబలార్తి మదిని భావింపవనా!॥ 223
సీ॥ ధాత్రిఁ జిత్రతమియాఁటె రాత్రితోఁచినయంత
శ్రీఖండకుధరాగ్రసీమడిగ్గి
దక్షిణకామినీ స్తనలిప్తఘనసార
సారసౌరభలక్ష్మి సంగ్రహించి
మంజులఫలపుష్ప మంజరీనవలతా
సంజాతఘనవనస్థలుల డాఁగి
అఖిలధరాధీశ్వరాంతఃపురగవాక్ష
సముదయంబులను కన్నముల దూరి
మానవులకించుకంతయుఁ గానఁబడక
దొంగభంగి నెసంగి తస్వంగికిచటఁ

జారధర్మము తెలుపుచు సారిదిసేఁచ
మలయుటిదినీకుఁ దగున యోమలయపవన! 224

మ॥ పరభూభృచ్ఛలనంబొనర్చితివొ శుంభత్ఖ్యాతిమైమిత్రునిన్
శరభృత్సంఘముచేత బాధపడకుండంజేసితో చిక్కవో
యిరవొందన్ గతిలేకయుండెడి మహాహీనుండు లోఁగొన్నచో
నరజోవృత్తియుకా మహాబలసమాఖ్యంజెంద నీ కాశుగా!॥ 225

ఆ॥ మూలఁబడియు హితునితో లోకమేఁచంగఁ
బూనునిను హరింపఁ బుట్టుగుడ్డు
పాపజేనిచేతఁ బరఁగఁగాదని విధి
నన్నగాలిచేసె నన్న! గాలి!॥ 226

తే॥ ఘనభయంకర కాలకింకరకఠోర
ఘోరచేష్టితములుగాంచి క్రూరబుద్ధి
చెలఁగిపరతెంచునీకు దాక్షిణ్యమేల
కలుగనేర్చుఁ బ్రభంజన! లలనమీఁద॥ 227

తే॥ నీదుతూర్ణంబుచాలక నిష్ఠురముగ
రంగుమీఱఁ గురంగ తురంగమెక్కి
పొంగుచుఁ దరంగవళి నేఁచఁబూనివచ్చి
తేమిపాపంబుచేసెనీ కింత పవన! 228

క॥ సరసులసంగతిమెలఁగిన।సరవిన్ వడిసుళ్ళొనర్చు చపలతమానున్
సరసులసంగతిమెలఁగియు।నిరవుగ వడిసుళ్లుమాన వీవుసమీరా!॥ 229

తే॥ బోటి పాటంబుగాఁ బిన్ననాఁటినుండి
యకట! మీయాజ్ఞ తగ శిరసావహించి
మెలఁగఁ గాంచియు నూరక చలముఁబూని
యేలయుపుడేఁచమీకుఁ జండాలులార!॥

తే॥ ద్విజత చెన్నొంది మధుపానవృత్తి విడువఁ
జాలకయు మలినాంగులై చపలబుద్ధి
పనుల నేప్రొద్దుఁ దిరుగుచుఁ దనరుమీకు
భృంగతతి! యెట్టు రాజేర్చుఁ బెద్దబుద్ధి” 231

వ॥ అని మధుకరంబుల నిందించి మధుకరచికురయగు చిలుకల కొలికి చెవులకు ములుకులై తాఁకు పలుకులం జెలువుమీఱు చిలుకలంగనుంగొని యిట్లనియె, 232

—♦ చిలుకల దూషించుట ♦—

తే॥ “శుకసమాఖ్యవహించి యస్తోకగతుల
శౌరి సారెకుఁ బేర్కొంచు సరసవృత్తి
మెలఁగుచుండెడివా కయో చిలుకలార!
కొమ్మపై నేల తగఁ బండ్లుగొఱుక నిటుల 233

క॥ చక్కెర లప్ప లొసంగిన
మెక్కెతగఁ బ్రతికి పెంపుమీఱియు విషముల్
గ్రక్కుచుఁ గీరసమూహము!
యక్కట! యిపు డబలఁ గలఁచుటర్హంబగునే 234

తే॥ మొకము లెఱ్ఱఁగఁ జేసుక సెకలుచల్లి
బోటికడ మాటిమాటికి నూటి నోటఁ
గాయవేయక కూయుచుఁ గాల్వనేల
చిట్లుకొఁ అవులుకదమీరు చిలుకలార!” 235

వ॥ అని నారి మీఱి కీరంబుల నిస్సారవ్యాహారంబులం దూఱి ప్రకటనికట రసాలసాల సరసకిసలయవిసరగ్రాస కషాయకంఠనిష్ఠ్యూతి పంచమకుహూకారకూజితమ్ములఁ గలకంఠకంఠికిఁ గర్ణకఠోరంబొనర్చు కలకంఠంబులంగనుంగొని యిట్లనియె॥ 236

ప్రథమమున, శ్లో॥ ఆదిత్యమంబికాంవిష్ణుం గణనాథంమహేశ్వ
ర మనుశ్లోకమే పంచదేవతారాధనక్రమబోధకమను భ్రాంతిని బ్రాణా
దిత్యులకును నపానాంబికలకును విష్ణువ్యానములకును గణేశోదానము
లకును సమానేశ్వరులకును నసంగతాప్రామాణిక సంబంధప్రదర్శన
పూర్వకముగఁ బంచద్వారపాలకోపాసనాస్థానమున దాదిత్యాదిపంచ
దేవతోపాసనము ప్రవృత్తమని సమర్థించియుండుటంజేసి యీ స్వస
మర్థితాంశసంరక్షణార్థమే ప్రకృత మీ శ్రుతిక్రమము మార్చఁబడియె.
ద్వితీయపర్యాయము "దక్షిణశుషిః" అనునది స్వీకరించినయెడల నందు
వ్యాన ముపాస్యమగునుఁ బైశ్లోకమున ద్వితీయస్థానోపాస్య యంబిక
యని యుండుటంజేసి వ్యానాంబికల పరస్పరసంబంధాసంభవమై స్వ
గ్రంథవిరోధము సిద్ధమగుచున్నదని కాను శాస్త్రిగారీమార్పు చేయఁ
గలిగిరి. ఇదియరీతిఁ దక్కినపర్యాయములసంగతియుఁ దెలిసికొనవలెను
తరువాత

అందువలన స్నానసంధ్యయను శ్లోకములోఁ జెప్పఁబడిన దేవతార్చనశబ్దమునకు
ఋషులచేఁజేయఁబడిన పరోక్షనామములుగల పంచద్వారపాలకుల విడిచి తత్స్థానమం
దు శోణభద్రాది పాషాణమయపదార్థములనుంచి బహిర్వేదికయందుఁ దదర్చనరూప
మగు నవైదికకర్మము చేయఁగూడదని కనఁబడుచున్నది. ఇట్టిదేవతార్చనము ముముక్షు
వులచే నవశ్యము చేయఁదగినదే. అంతియేకాని యవైదికపాషాణమయ లింగాద్యర్చనము
చేయఁగూడదని ఛాందోగ్యహృదయము,

అని శాస్త్రిగారిగ్రంథము కనఁబడుచున్నది. ఈ పాషాణమయ
లింగాద్యర్చన మవైదికముకాదు వేదమూలక స్మృతిపురాణప్రతిపా
దితకర్మము వైదికమని సూతసంహితలో వైదికీతాంత్రికీచేతి యను
శ్లోకపు వ్యాఖ్యయందు మాధవాచార్యులచే వ్రాయఁబడియున్నది.
ఇట్టిపంచాయతనపూజం బ్రతిపాదించెడి స్మృతుల కన్నిటికిని వేదమూల
కత్వము లేదనిచెప్పుట కెవ్వరికిని శక్యముకాదు. పూర్వీకు లెవ్వ
రును నట్లు వ్రాసియుండలేదు. శాస్త్రిగారు "చేయఁగూడదనియే

కనఁబడుచున్న"దని యనిరి. శ్రుతులయందుఁగనఁబడుచున్నదో? స్మృతులయందుఁగనఁబడుచున్నదో ఒకవీరి గ్రంథమందే కనఁబడుచున్నది. ఫలము సమానమగుటవలన ముముక్షువులచే బంచద్వారపాలకోపాసన యెట్లు చేయఁదగినదో పంచదేవతోపాసనము నట్లే చేయఁదగినదని సంతోషింతురుగాక. ఇదియునుంగాక ద్వారపాలకోపాసనారూప దేవతార్చనము చేయఁదగినదనియు నవైదిక పాషాణమయ లింగాద్యర్చనము చేయఁగూడదనియు ఛాందోగ్యహృదయమని వ్రాసిరి. ఛాందోగ్యహృదయమనగా ఛాందోగ్య శ్రుత్యభిప్రాయమనికదా యర్థము? అట్లైన ఛాందోగ్యశ్రుతికి ద్వారపాలకోపాసనయందుఁ దాత్పర్యమా? లేక లింగాద్యర్చన నిషేధమందా? ఉభయమందునా? మొదటిపక్షమని రేని లింగాద్యర్చనము చేయఁగూడదను ఛాందోగ్యాభిప్రాయ మెట్లులభించును. రెండవపక్షమంగీకరించినయెడలఁ బంచద్వారపాలకోపాసనకు వైదికత్వసిద్ధి లేకపోవలెను. తృతీయపక్షమునే శరణుపొందినయెడల నుభయార్థకత్వదోషము సంభవించును. ఒకవాక్యమునందే ద్వారపాలకోపాసనావిధియు లింగాద్యర్చనానిషేధమును సంభవింపనేరదు. మీమాంసకు లట్లంగీకరించియుండలేదు. అందువలన నటులువ్రాయుట ఛాందోగ్యహృదయము కాదు. ఛందోజ్ఞహృదయము. తరువాతి గ్రంథము.

ప్రమాణవిషయములో శ్రుతిస్మృతీతిహాసపురాణములకుఁ బ్రామాణ్య మంగీకరింపవలెను. వానిలో శ్రుతులు స్వయముగాఁ బ్రమాణములగుటవలన విచారణావకాశము లేదు. తక్కినవానికో? శ్రుత్యనుగుణ్యముచేతనే ప్రామాణ్యము చెప్పవలెను. పురాణములకును స్మృత్యర్థానుసారముచేతనే ప్రామాణ్యము చెప్పవలెను. ఇట్లుండఁగా స్మృతీతిహాసపురాణములం దెంతవఱకు శ్రుత్యర్థము లగించునో యంతవఱకే ప్రామాణ్యము. తక్కినభాగములయందు లేదు. ఇందుకు శాక్యస్మృతియొకటి దృష్టాంతము. శ్లో॥ సఏవ భగవాన్ దేవో ధృత్వారూపంచవైశ్వకం సుఖదుఃఖాదికంసర్వం దృశ్యతేనుభవన్నివ॥ ఈవిషయములోఁ బరిణామవాదులు పరమాత్మకుఁబరిణామిత్వము దుఃఖదోషహీనుడగు

పరమాత్మకు దుఃఖిత్వమును వేదవిరుద్ధములగుటవలన నప్రామాణ్యమనిరి. పరమాత్మయొక్క రూపమునకు శక్తిమాత్రావశేషిత్వము వేదమందు నిర్ణయింపఁబడియున్నది.

అనియున్నది. ఇక్కడ స్మృతీతిహాసపురాణములకు వేదార్థానుగతిపర్యంతము ప్రామాణ్యమే. అట్టియనుగతియనునది సర్వజ్ఞులగు మహర్షులచేతనే వ్రాయఁబడియుండవలెఁగాని యనధీతవేదులు నజ్ఞాతతదర్థులు నల్పజ్ఞులు నగు సాధుఁగులకు నిర్ణయింపశక్యము కాదు. కేవల కుక్షింభరణోపాయములయందు వినియోగించుచుండెడి విద్యాలేశములుగలవారికి ధర్మవ్యవస్థచేయుట కెట్లుసామర్థ్యముగలుగును. ఇదియునుంగాక స్మృతీతిహాసపురాణములయందు వేదవిరుద్ధార్థ మెందుకని చెప్పఁబడియుండును. వేదార్థోపబృంహణార్థమేకదా వానియుత్పత్తి. ఒకవేళ నితిహాసపురాణములయం దర్థవాదములున్నవని తలఁచెదరేని యంతమాత్రముచే వాని కప్రామాణ్యము చెప్పుటకు వీలులేదు. ఎట్లు వేదములయందుండెడి యర్థవాదవాక్యములు విధివాక్యముతో నైక్యమునుబొంది విధేయార్థమునకు స్తావకములగునని చెప్పెదమో పురాణాదులయందును నట్లే చెప్పవచ్చును. కనుకనే యప్పయదీక్షితులు మొదలగు పూర్వికులచే సర్వపురాణములకు నిరంకుశప్రామాణ్యమంగీకరింపఁబడినది. ఎక్కడనైనను వేదవిరుద్ధార్థముకూడఁ బురాణములయందుఁ జెప్పఁబడియున్నను నవి యధికారిభేదముచే గ్రాహ్యములని స్మృతికర్తలచే స్పష్టముగ వ్రాయఁబడియున్నది. దేవపూజాపరమునైన యుక్తెక్కడను వ్రాయఁబడియుండదు. శాక్యస్మృతియందును నివశబ్దముచే వాస్తవదుఃఖిత్వము పరమాత్మకు లేదనియే స్పష్టమగుచున్నది. అయినను నక్కడ నేదోవిధముగ నాస్మృతికి వేదవిరుద్ధార్థబోధకత్వముచే నప్రామాణ్యము కొంతమందిచే వ్రాయఁబడినఁబడెఁగాక. అట్లు పంచాయతన పూజాబోధకస్మృతులకు నెక్కడనైన నెవరిచేనైన నప్రామాణ్యము వ్రాయఁబడియున్నదా? తరువాత శాస్త్రులవారు

శ్లో॥ పురాణేష్వర్థవాదిత్వం యేబ్రువంతి నరాధమాః తైరర్జితాని పుణ్యాని

తద్వ్యదేవభవంతివై॥ ఈశ్లోకము పురాణము లసత్యములని చెప్పువారికి సుకృతహానియగునను నర్థము బోధింపదు. వేదమందు సమన్వయము చేయఁదగిన యర్థవాదన్యాయమును బురాణములయందుఁ జేయువారి కనిష్టముం జెప్పుచున్నది.

అని వ్రాసిరి-ఇందువలనఁ బురాణము లబద్ధములన్న యెడల దోషము లేదను నర్థము లభించుచున్నది-అట్లైన యెడల నిబంధన గ్రంథములయందుఁ బురాణవచనోదాహరణపూర్వకముగ ధర్మవ్యవస్థ చేయుటకు వీలు లేక పోవలసివచ్చును.

శిష్టాచారము సాంప్రదాయమునియు నెడిచో నది శాస్త్రీయమైయున్నయది శాస్త్రమందు శిష్టపదార్థ మిట్లు పరిష్కరింపఁబడియున్నది. వేదమందుఁ బ్రతిమారాధనము "నతస్యప్రతిమాస్తి, యస్యనామమహద్యశః" అని నిషేధింపఁబడియుండుటవలనఁ బ్రతిమారాధకులు శిష్టులు కారని శాస్త్రహృదయము.

అని యేమో వ్రాసిరి. నతస్యప్రతిమాస్తీత్యాకారక శ్రుతి స్వమతమునే యున్మూలనము చేయుచున్నది. తస్య, ఆయీశ్వరునకు, ప్రతిమా, మూర్తి, నాస్తి, లేదు. అనికదా యీశ్రుతియందు శాస్త్రిగారి యభిప్రాయము. కాని యర్థ మది కాదు. అట్లుపబృంహకములు లేవు. మూర్తినిషేధమందుఁ బ్రకరణాదికమైనను లేదు. తత్పూర్వమందుఁ దత్ప్రతిమాప్రసక్తియే సున్న. పూర్వాచార్యులచేనైనను నీశ్రుతి మూర్తినిషేధపరముగా వ్యాఖ్యానము చేయఁబడియుండలేదు. శాస్త్రిగారు తమ యపూర్వపాండిత్యబలముచేతనే యట్లు వ్యాఖ్యానము చేసిరి. ఈశ్రుతికి మూర్తిసద్భావపరమైన యర్థముకూడ సంభవించును. మూర్తిపదమున శాస్త్రిగారభిప్రాయపడినది కరచరణాద్యవయవవిశిష్టవిగ్రహమనియో? పాషాణాదికమనియో? రెండువిధములఁగూడ మూర్తినిషేధము చేయుటకు శక్యము కాదు. చేసినచో వక్ష్యమాణములగు నుభయవిధప్రమాణములను ఖండింపఁగలవు. నతస్య, నమ్రీభూతునకు, (భక్తునకు) ప్రతిమా, భక్తానుగ్రహార్థమై మాయాధీనమగు మూర్తి

అస్తి, కలదా, అని యీశ్రుతి కర్థము. కనుకనే గీతలయందు, శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున! మొదలగువానిచేఁ గృష్ణభగవానుఁడు వచించియుండెను. ఈ శ్రీకృష్ణభగవానుఁడుకూడ మనతో సమానుండనియనుటకు వీలులేదు. ఆవిషయమై తచ్ఛ్లోకమునకు శంకరులవారు భాష్యమందలియవతారికలో వాసుదేవుఁడనీశ్వరుఁడనియు నసర్వజ్ఞుఁడనియుఁ గలిగిన మూర్ఖులశంకను బరిహరించుచు శ్రీకృష్ణభగవానుఁడు వచించెనని స్పష్టగించియుండిరి. అటుపైని తాన్యహం వేదసర్వాణియని తచ్ఛ్లోకోత్తరార్థమందుఁ జెప్పఁబడిన తన కనేకజన్మజ్ఞానముకలుగుటయందు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము కలవాఁడనగుటవలనను ననావరణశక్తిగలవాఁడనగుటవలనను నా కట్టిసామర్థ్యము కలదను నభిప్రాయము భాష్యమందు వ్రాయఁబడియుండుట వలనను సత్యజ్ఞానానందస్వరూపమగు బ్రహ్మమునకే యనేకమూర్తులున్నట్లు కానఁబడుచున్నందువలన నేనుజెప్పినదే యేతచ్ఛ్రుత్యర్థమనుట నిస్సంశయము. తదుత్తరవర్తి "అవజానంతిమాంమూఢా మానుషీంతనుమాశ్రితం, పరంభావమజానంతో మమలోకమహేశ్వరం' అనుశ్లోకముచేతనే పరమేశ్వరుఁడనగు నా సామర్థ్యము కనుగొనలేక మూఢులు సామాన్యమనుష్యునివలెనే భావించుచున్నారని స్పష్టముగాఁ జెప్పఁబడియే యున్నది. ఇట్లు చెప్పినచో శ్రుతిస్మృతుల కుపబృంహణోపబృంహ్యభావముచే నేకవాక్యత కుదురుచున్నది. అట్టిజన్మము జీవులకువలెఁగాక మాయావశమువలననే కలుగుచున్నదని తెలుపుటకై శ్లో॥ అజోపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్ ప్రకృతింస్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥ యని మాయాధీనజన్మము పరమాత్మకున్నదని స్పష్టముగాఁ జెప్పఁబడినది. అక్కడ భాష్యమందును ధర్మాధర్మసూన్యుఁడగు నిత్యేశ్వరునకు జన్మ మెటులఁగలుగునని శంకించుకొని యాత్మ మాయచే దేహముగలవానివలెనే పుట్టినవానివలెనే యగుచుండునని శంకరులచే వ్రాయఁబడియున్నది. అందువలన

నట్టిజన్మము మాయాధీనమనుట సిద్ధము. అట్టిజన్మ మెప్పు డుసంభవించు ననుదానికి, శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానంసృజామ్యహం॥ అను వాక్యము చేసమాధానము చెప్పఁబడియున్నది. అట్టిమాయాధీనజన్మ మెందుకని స్వీకరింపవలెనను ప్రశ్నమునకు, శ్లో॥ పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥ అని సమాధానము చెప్పఁబడినది. ఇట్టి ప్రమాణమువలన భక్తులఁగూర్చి మాయాధీనవిగ్రహ ముండుటవలననే యక్కడనే 11 వ యధ్యాయమున "నవేదయజ్ఞాధ్యయనైర్నదానైః" అనుశ్లోకమున నేవంరూపఅని తనకు రూపమున్నట్లు చెప్పుచు నటుపైని "నాహంవేదైర్నతపసా నదానేనచేజ్యయా భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోర్జున! జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుంచపరంతప!" మొదలగు శ్లోకములచే వేదాధ్యయనాది కర్మములచే స్వాధీనుఁడఁగానని యు నొక్కయనన్యభక్తిచేతనే తనయాథార్థ్యముగు రైయుఁగుటకును దననుజూచుటకునుదనలోనైక్యమును బొందుటకునుశక్యముగునని యు భక్తివశ్యత స్పష్టపఱుపఁబడియున్నది. విశ్వరూపప్రదర్శనమనునదియుపాసనకొఱకని ద్వాదశాధ్యాయప్రథమశ్లోకబాష్యమందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. అందువలనభక్తులకే పరమేశ్వరుఁడు మూర్తిని గనఁబఱచునుగాని యభక్తులకుఁ గనఁబఱుపఁడని ఫలితాంశము. కనుకఁ బైనివ్రాసిన నతస్యప్రతిమాస్తిత్యాకారక శ్రుతికి నేజెప్పినయర్థమే న్యాయ్యము. ఇదియునుంగాక యాశ్రుతికి "యస్య నామమహద్యశః,, అను నుత్తరవాక్యముచేఁ బరమేశ్వరునకు నామమున్నట్లుచెప్పుచుఁ బూర్వవాక్యముచే రూపము నెట్లు నిషేధించును? సత్యజ్ఞానానందస్వరూపుఁడగు బ్రహ్మమునకు నేతినేతీత్యాదిశ్రుతులు సర్వోపాధినిషేధముం జెప్పుచుండుటవలన నట్లేయాశ్రుతియు రూపనిషేధముం జేసినదని శ్రీశాస్త్రిగారందురేని "యతోవాచోనివర్తంతే యద్వాచానభ్యుదితం, యేనవాగభ్యుద్యతే" మొదలగు శ్రుతులు బ్ర

హ్మవస్తువు వాక్యనకుఁగూడ విషయముకాదని చెప్పుటవలన నామని ర్దేశముచేయుటయు ననుపపన్నమే యగును. కనుక "నామరూపయో ర్నిర్వహితా, నామరూపేవ్యాకరవాణి, శ్లో॥ సృష్టిర్నామ బ్రహ్మరూపా సచ్చిదానందవస్తుని! అబ్ధాఫేనాదివ త్సర్వనామరూపప్రసారణా॥ అస్తి భాతిప్రియంరూపం నామచేత్యంశపంచకం ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం,, మొదలగు శ్రుతిస్మృతులయందు నామ రూపములు సృష్ట్యంతఃపాతులని చెప్పఁబడుటవలన నామరూపసద్భావ పరముగానే యాశ్రుతికి వ్యాఖ్యానముచేయుటకు శక్యమగును. మూ ర్తినిషేధపరముగానే చేయవలెనని గుర్వాజ్ఞగాని రాజాజ్ఞగాని లేదు. ప్రకరణమునుగాని యుపబృంహణాదికమునుగాని చూడక శ్రుత్యాదు లకు స్వతంత్రముగా నర్థముచెప్పఁబూనినయెడల బుద్ధివృత్తులు నానా రూపములగుటవలన నొక్కొక్క రనేకవిధములఁ జెప్పవచ్చును. కనుక నేదోనొక పూర్వవ్యాఖ్యానమునో యుపబ్రంహ్మకపురాణా దికమునో స్వీకరించియే శ్రుత్యాదుల కర్థనిర్ణయము చేయ వలెఁగాని కేవలము తమబుద్ధికిఁదోఁచినట్లు చేయఁగూడదు ఈశ్వరునకు మూర్తిసద్భావమం దీయొక్కశ్రుతియే ప్రమాణము కాదు. అనేకములుగలవు. అందుఁ గొన్నిమాత్ర ముదాహరింతును. ఛాందోగ్యశ్రుతి॥ హిరణ్యశ్మశ్రుః, హిరణ్యకేశః, ఆప్రణఖాత్సర్వఏవ సువర్ణః, తస్యయథాకప్యాసం పుండరీకమేవమక్షిణి. తస్యోదితినామ॥ ఇక్కడ మనకువలెనే యాదిత్యమండలాంతర్వర్తియగు పురుషునకు శ్మశ్రుకేశనఖాదులును, ఉత్, అను నామమును గలవని చెప్పఁబడి యున్నది. అంతస్తద్ధర్మోపదేశాత్, అనుసూత్రమునకు వ్రాయఁబడిన భాష్యమందు "పరమేశ్వరుఁడు హిరణ్యశ్మశ్రుత్యాదిరూపముగలవాఁ డనునది యసమంజసమనుస్థలముఁ జెప్పుచున్నవారము, పరమేశ్వరుఁ డును భక్తులయందలి యనుగ్రహముచే స్వేచ్ఛావశమున మాయా మగురూపముఁ ధరించును, ఇదియునుంగాక యెక్కడ నిర్విశేషమగు

శుద్ధబ్రహ్మస్వరూపము చెప్పఁబడునో యక్కడ అశబ్దమస్పర్శమరూప మవ్యయం మొదలగు శ్రుతులు ప్రవర్తించును, పరమేశ్వరుఁడు సర్వ కారణమగుటవలనఁ గొన్ని జగద్ధర్మములతోఁ గూడుకొని యుపాస్యుఁ డగునని చెప్పఁబడును, శ్రు॥ సర్వకర్మా సర్వకామ స్సర్వగంధ స్సర్వ రసః మొదలగు స్థలములయందును నాలాగుననే హిరణ్యశ్మశ్రుః మొదలగు నిర్దేశము కూడ నగుచున్నది" యని పరమేశ్వరునకు నామ రూపములున్నట్లు స్పష్టముగఁ జెప్పఁబడినది. ఇట్లె తైత్తిరీయోపనిష త్తులోని నారాయణీయమందును, శ్రు॥ ఋతగ్ంసత్యంపరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం॥ అను శ్రుతియొక్క భాష్యమందు విద్యారణ్యుల వారిచే నట్టిబ్రహ్మము స్వభక్తానుగ్రహార్థ ముమామహేశ్వరాత్మకమగు పురుషరూపముకలదియగునని వ్రాయఁబడియున్నది. ఋతగ్ం సత్యమను పదద్వయముచే సూచింపఁబడిన సత్యముగుబ్రహ్మమునకు మూర్తియున్నట్లు చెప్పఁబడెను. అక్కడనే నమోహిరణ్యబాహవే హిరణ్యపతయే యను శ్రుతియొక్కభాష్యమందును భక్తానుగ్రహార్థము సువర్ణమయముగు కృత్స్నశరీరముగల బ్రహ్మముకొఱకని విగ్రహాస్తిత్వమే చెప్పఁబడినది. ఇట్లే రామతాపిన్యుపనిషత్తునందుఁగూడ, శ్లో॥ చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః। ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా॥ అనియు, శ్లో॥ అవిముక్తేతవక్షేత్రే సర్వేషాం ముక్తిసిద్ధయే అహంసన్నిహితస్తత్ర పాషాణప్రతిమాదిషు క్షేత్రేస్మిన్ యోర్చయేద్భక్త్యా మంత్రేణానేనమాంశివ! అనియుఁ బాషాణప్రతిమానులయందుఁ బూజించుమని శివునిగూర్చిన రామోక్తిగలదు ఇది పాషాణాద్యర్చనము వైదికమన్నందులకుఁ బ్రమాణము. ఇట్లశరీరమగు బ్రహ్మమున కుపాసకకార్యార్థమై కల్పితమూర్తియున్నదని చెప్పఁబడియున్నది. ఇట్లే స్మృతులయందుఁగూడఁ జెప్పఁబడియున్నది.

మనుస్మృతి 3 అధ్యా 39,40 శ్లోకములు, "బ్రాహ్మాదిషువివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః, బ్రహ్మవర్చస్వినః పుత్రాః జాయంతేశిష్టసమ్మతాః॥ రూపసత్త్వగుణోపేతాః ధనవంతోయశస్వినః- పర్యాప్తభోగాధర్మిష్ఠా జీవంతిచశతంసమాః" అనఁగా బ్రహ్మాద్యష్టవిధ వివాహములలో వరుసగా మొదటి నాలుగువివాహములవలన బ్రహ్మ (వేద) వర్చస్సుగలవారును, పెద్దలచేఁ బొగడఁదగినవారును, సౌందర్యము, బలము, గుణము, మున్నగువానితోఁ గూడినవారును, ధనయశోవంతులును, సర్వసుఖభోగులును, ధర్మిష్ఠులును, శతవత్సరజీవులును, నగు పుత్రులు పుట్టుచున్నారు. ఈపుత్రులు రజోదర్శనమునకుఁ బూర్వపువివాహఫలములు. రజోదర్శనానంతర వివాహములవలన గలిగెడి సంతానముంగూర్చి "ఇతరేషుతుశిష్టేషు నృశంసానృతవాదినః, జాయంతేదుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః॥ తక్కిన నాలుగువివాహములవలన హత్యఁజేయువారును, నసత్యమును బలికెడివారును, వేదయజ్ఞములను ద్వేషించెడివారును నగు సుతులుదయింతురని మనువుచెప్పియున్నాఁడు. ఈపుత్రులు రజస్వలావివాహఫలములు, కావుననే పూర్వాచారపరాయణు లీనింద్యపుత్రులను గలిగించెడి రజస్వలావివాహములనుమాని వీనిని సెలవొసఁగెడివారిని ద్వేషించి సత్పుత్రజనకములగు బాల్య వివాహములఁ గావించుకొని వానిని ఖండింపవచ్చెను. నవీనాచారపరాయణవాదములను నిరసించుచున్నారని లోకులు గ్రహింతురుగాక.

## మనసోదరులు రజస్వలావివాహములు సూత్రానురోధములని సాధించిరా?

అను విషయముంగూర్చి యిఁకఁజర్చింపవలసియున్నది. శ్రీమాన్ పెద్దింటి నరసింహాచార్యులవారు రజస్వలావివాహములు సూత్రోక్తములని తెలుపుటకయి వైష్ణవులకు ముఖ్యములగు విఖనస సూత్రమునందు వివాహఘట్టమున స్థాలీపాకప్రక్రియ బోధించు స్థలములో స్థాలీపాకమునకువలయు తండులములకయి నాలుగుపంచముల (ముప్పదిరెండు మానికల) ధాన్యమును పెండ్లికూఁతురు దంపవలయునని చెప్పఁబడియున్నది. ఈపని పదియాఱేండ్లప్రౌఢచేఁ గావింపఁదగినదగుఁగాని యెనిమిదేండ్లబాలికచేతఁ జేయింపఁదగినది కాదు. కావునఁ బూర్వకాలమునఁ బదియాఱేండ్లమీదనే కన్యలకు వివాహము గావింపఁబడుచుండెడిదని సెలవిచ్చిరి. ఇదేమిచిత్రము, ముప్పదిరెండుమానికలవడ్లు పదియాఱేండ్లప్రౌఢ దంపఁగలదఁటగాని యెనిమిదేండ్లబాలిక దంపలేదంట. ఏమి వీరి లోకానుభవము, పదియాఱేండ్లపడుచుమాత్రము ముప్పదిరెండు మానికెలవడ్లు దంపఁగలుగునా? ఇదియు నసంభవమె, చిన్నప్పటినుండియు వడ్లు

దంపుటయందె తమ జీవితముగడుపుచున్న యిరువురు ప్రాయంపుబాటకపు పడచతు లుదయము మొదలుకొని మధ్యాహ్నమువఱకు దంచినయెడ నవి బియ్యమగునేమో కాని పుట్టినదాదిగాఁ గష్టమేమో యెఱుంగక పుట్టింట నల్లారుముద్దుగాఁ బెరిగి పెద్దదైయున్న ముద్దులగుమ్మ పదియాఱేండ్ల ప్రాయము వచ్చినంతమాత్రముననే ముప్పదిరెండుమానికలవడ్లు దంపఁదగిన సామర్థ్యముకలదిగ నుండుననిచెప్పుట స్వభావవిరుద్ధముగా నుండుననుటకు సంశయములేదు. ఈమెయే దంపఁగలిగిన నెనిమిదేండ్లబాలయును దంపఁగలదని చెప్పవచ్చును. అట్లుగాక పదియాఱేండ్ల పడుచుచే సంస్కారము చేయించి పిదప నితరులచే దంపింపవచ్చునని యందురా! ఆపని బాలికచేతనుగూడఁ గావింపఁదగునదేకాన నీమాత్రపుయుక్తిచేత బాల్యవివాహములు పూర్వమున లేవనిచెప్పుట సమంజసము గాదు. ఇంతియగాదంట. అట్లుదంపఁగావచ్చినతండులములను హండాలోపలఁ బోసి యాపూఁబోఁడియే వండవలెనని సూత్రము చెప్పుచున్నదంట. ఆపని పదియాఱేండ్లపడుచుకు సాధ్యమగును గాని యెనిమిదేండ్లబాలికకు వశముకాదంట. కావుననే పూర్వము పదియాఱేండ్లపడుచులకుఁ బరిణయము గావించెడివారని తలంచిరంట. వింటిరా! యీవిచిత్రవాదము ముప్పదిరెండుమానికలవడ్లు మనము దంపించితిమేని సాధారణముగా సడింపుబియ్యము పదునాలుగు మానికెలు వచ్చునుగదా. పదునాలుగు మానికలబియ్యము ఉడికినహండాను పదియాఱేండ్లపడుచుమాత్రము దింపఁగలుగునా? చిన్నతనమునుండియు వంటఁజేయుటయందుఁ గడితేరిన యిరువురు గడెకాండ్రబ్రాహ్మణులు హండాను నతికష్టముమీఁద దింపుటకుఁ జాలుదురో చాలరో చెప్పఁజాలము. ఇట్లుండఁ బదియాఱేండ్లపడుచుమాత్ర మెట్లుదింపఁగలుగునని తలంచిరి? ఒకవేళ నామెచే సంస్కారముఁజేయించి యితరులచేత వండించెదమందురా? అటులైన నాపని యెనిమిదేండ్ల బాలికచేతను గావింపఁదగినదే కాన నీయుక్తియు వ్యర్థమగుచున్నది.

ఆపస్తంబగృహ్యసూత్రమున "త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనంచ" అను సూత్ర మొక్కటికలదు. దీనింబట్టి దంపతులిరువురును వివాహాదితులలో మూఁడురాత్రులు నేలపై శయనించి యుప్పు, కారములను, వదలి బ్రహ్మచర్యముఁ జరుపవలయునని చెప్పఁబడియున్నది. ఈసూత్రములోని బ్రహ్మచర్యశబ్దమునకు వ్యాఖ్యాత యష్టాంగమైథునవర్జనలక్షణముగు బ్రహ్మచర్యమని విశదీకరించియున్నాఁడు కాన నా మూఁడురాత్రులు మైథునవర్జముగా నుండవలెనని చెప్పుటచేఁ బిదప వారిరువురు దాంపత్యధర్మమును సలుపఁదగుదురని బోధపడుచున్నది. కాన వివాహమునకుముందు రజస్వలయైయుండనియెడ నిది సిద్ధింపదు, కావునఁ బూర్వకాలమున రజస్వలావివాహముతో

యుండెడివని వాదింపఁజొచ్చిరి. ఇది యొకవింతవాదము. మిథునకర్మ మెనిమిదిభాగములుగానున్నది. అందు మొదటియేడును భార్య బాలికగానుండినను, ప్రౌఢగానుండినను గావింపఁదగినవే. ఎనిమిదవదిమాత్రము యుక్తవయస్సులోనున్న భార్యయందుఁ గావింపదగినదై యున్నది. వానింగూర్చి బృహస్పతి యిట్లు చెప్పుచున్నాడు. "స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం సంకల్పో ధ్యవసాయశ్చ క్రియానిర్వృతి రేవచ ఏతన్మైథునమష్టాంగం ప్రవదంతి మనీషిణః" అనఁగా భార్యాభర్తలొకరినిగూర్చి యొకరు, స్మరణము=తలఁపు. కీర్తనము=స్తుతి. కేళి=పరిహాసము, ప్రేక్షణము=బాగుగాఁ జూచుట. గుహ్యభాషణము=రహస్యముగా మాటలాడుట. సంకల్పము=మనోనిశ్చయము. అధ్యవసాయము = ఉత్సాహము. (ఈయేడును భార్య బాలికగానున్నను, యువతిగానున్నను) నుపయోగింపఁదగిన మైథునాంగములై యున్నవి.) క్రియానిర్వృతిః = సంభోగసౌఖ్యము (ఇదిమాత్రము ప్రౌఢయందుఁ గావింపఁదగినది) కాన మైథునవర్జనమైన బ్రహ్మచర్యము నడుపవలసినదనినంతమాత్రమునఁ గన్య రజస్వలయై యుండవలసినయగత్యము కానరాదు. వధువు బాలికయైనచో నామె కామ మెఱుఁగనిదికావునను, వరుఁడు బాలికయందుఁ గామము జెందఁడుకావునను, క్రియానిర్వృతిరూప మిథునకర్మమున కవకాశమేకలుగదు. సావకాశములగు మిగిలిన యేడువిధములగు మైథునాంగములను వర్జించుటకు వధూవరులు సకాములుకానందున వారికి సావకాశముకలదని చెప్పుట కావంతయు సంశయము లేదని తోఁచుచున్నది. అట్లుగాక సకాములై యుక్తవయస్సులోనున్న వధూవరులు తుదినున్న క్రియానిర్వృతిరూపమిథున కర్మము దమ్ముఁగోరి వేష్టించియున్నవారినిజూచి యతికష్టముగా విసర్జించినను సావకాశములగు మిగిలిన యేడువిధములగు మైథునాంగములలో నేవియో కొన్నిటినిఁ గావింపకపోరని గట్టిగాఁ జెప్పవచ్చును. కాన నీసూత్రము నాధారముజేసికొని చేసిన యుక్తివాదము రజస్వలావివాహమునకంటె బాల్యవివాహమునకే యెక్కువబలమొసంగుచున్నదని తేలినది. పైఁజెప్పి బ్రహ్మచర్యమును వధూవరులు పృథక్శయ్యలపైఁ బరుండి కావింపవలెనని చెప్పబడియుండలేదు. ఇఁకేమన? వ్యాఖ్యానకర్త "నాపిపృథక్శయ్యా" ఉభయోరపి విగ్రహాత్ అని యిరువురకు నధశ్శయ్యయని చెప్పుటచే వేఱుశయ్యయకాదు. ఈచెప్పుటచే వధూవరులిరువురును నొకశయ్యపైఁబరుండియష్టాంగమైథునవర్జమైన బ్రహ్మచర్యమును సలుపవలెనని [illegible]. ఇది [illegible] వివాహమైన సంభవమగును కాని యువతీవివాహమైనచో, అమ్మ [illegible]! రజస్వలయై [illegible]యున్న పడుచుభార్య రాత్రికాలమునందుఁ దనప్రక్కలోఁ బడుకొనియుండఁగా వరుఁడెట్లు బ్రహ్మ

చర్యము నడుపునో యెట్లు చెప్పనగును? (ఆవిషయము సర్వవిషయసంచార ధురీణులగు ప్రాచీనకవిమణుల గ్రంథరత్నములవలననే బోధపడుననుట నిర్వివాదాంశమేగదా! యోజింపుఁడు.)

క॥ వ్రతభంగమైన గానీ, మతిమంతు మదాత్తవేషు మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల, కతులమహోత్సవము గాఁగ నని చెలి ప్రీతిన్
అను బిల్హణీయములోనిపద్యము వధువుపఠించుటవిని వరుఁడు

ఉ॥ "తామరసాక్షి! నీ నిశితదారుణ వీక్షణతీక్ష్ణ బాణముల్
వేమఱు నాటి నా హృదయవీధి వ్రణంబొనరించెఁ జూడుమా
యీమెయి నౌషధద్వితయ మీయవె త్రావెదఁ బూఁతఁ బాసెదన్
నీమధురాధరామృతము నీకుచకుంకుమపంక మేర్పడన్॥

చం॥ అనినఁ దామరసాక్షి కాండపట మత్యంతంబు బోఁద్రోసి గ
న్గొనఁ దచ్ఛయ్యకుఁ జేరి ప్రౌఢగతి సంకోచింపకే లెమ్మహా
యని చేఁదమ్ములఁ జాఁపి చన్గవ నెదన్ హత్తింప గాఢమ్ముగా
ఘనమోహమ్మునఁ గౌఁగలించెఁ (గవి)పతియున్ గౌతూహలం బొప్పఁగన్॥

అను పద్యార్థములననుసరించి బ్రహ్మచర్యమును బాడుచేయక నెగ్గింతురని యెట్లువిశ్వసింపనగును?

"విశ్వామిత్ర పరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనాః
తేపి స్త్రీముఖపంకజం సలలితం దృష్ట్వాపి మోహంగతాః
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుంజంతి యేమానవాః
తేషామింద్రియనిగ్రహోయదిభవే ద్వింధ్యః ప్లవే త్సాగరే॥"

గాలి నీరు ఆకులు లోనగునవి యాహారములు గాఁగొని తపమాచరించెడి విశ్వామిత్రపరాశరాదిమహాత్ములే సుందరములైన మందయానల వదనారవిందముల గనినంతనె మోహముఁబొంది తమబ్రహ్మచర్యమును బాడుజేసుకొనియుండఁగా నేయి, పాలు, పెరుగులతోఁ గూడిన శాల్యన్నమునుభుజించి నవయస్కులై సకాములైయున్న వధూవరులేకశయ్యాగతులైయుండగా బ్రహ్మచర్యమునకుపుట తటస్థించనేని వింధ్యపర్వతము సముద్రములోఁ దేలియాడదా? తేలియాడును. వివాహదీక్షయందు బ్రహ్మచర్యము నడుపవలయునని చెప్పినంత మాత్రముననే పూర్వకాలమున రజస్వలా వివాహములున్నవని చెప్పుట యసమంజసమని యీవిమర్శమువలన విశదమైనది. ఇట్లువిన్నవింపఁగనె ము

రల మనసోదరులు దీనికంటె రజస్వలావివాహములను సిద్ధాంతముఁజేసెడి బలవదాధారము సూత్రమునందు మఱియొకటి కనుపడుచున్నది-అది మావాదమును ఢంకామీదదెబ్బగొట్టి చాటుచున్నది అదేమనెదరా? ఆంధ్రదినపత్రిక 6-2-15 తేదిగల సంచికను శ్రీయుత బైసాని నరసింహేశ్వరగుప్తగారు రజస్వలా వివాహమునుగూర్చి వ్రాసిన వ్యాసమునందు.

వివాహములో నాలవనాఁటిరాత్రి "అపశ్యంత్వా మనసాచేకితానం, తపసోజాతం తపసోవిభూతం, ఇహప్రజా మిహరయిగ్ంరరాణః ప్రజయా స్వప్రజాయపుత్రకామ" అని వరునిగూర్చివధువు నీవు యోగ్యుఁడవనియుఁ దపస్సుచేబుట్టి తపస్సుచే వృద్ధిఁ బొందియున్నావనియు నేను మనస్సునందు నిశ్చయించియున్నాను-కనుక నాయందుఁ బుత్రకాముఁడవై యుండునీవు ఇఁకమీఁద సంతోషపూర్వకముగా సంతానము పొందుమని తాత్పర్యము- ఇందుకుప్రత్యుత్తరముగాఁ బెండ్లికొడుకు "అపశ్యంత్వామనసాదీధ్యానాగ్ం స్వాయాంతనూంఋత్వియేనాధమానాం, ఉపమాముచ్చా యువతిర్బభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే" అని వధువునుగూర్చి వరుఁడు నీవీసమయమునందు నాతోఁగూడవలెనని యపేక్షించుచున్నట్టు నామనస్సుచేతఁ గనిపెట్టితిని కనుక యువతివై పుత్రకామురాలవై యున్న నీవు నన్నుగూడి సంతానమును బొందుమని యీమంత్రములచేతఁ జెప్పునారు -పైమంత్రములనుబట్టిచూడఁగా రజస్వలలైనబాలికలకే వివాహము చేయవలయునని స్థిరపడుచున్నది.

అని చెప్పలేదా? యని ప్రశ్నింతురు. దీనికి సమాధానమే మన, గుప్తగారీరెండుమంత్రములకుఁ జేసిన యభిప్రాయము భాష్యకర్తలు వ్రాసినయర్థమునకుఁ గొంత విరుద్ధముగానుండినను వధువు వరునిగూర్చి "నాయందుఁ బుత్రకాముఁడవైయుండు నీవు, ఇఁకమీఁద సంతోషపూర్వకముగా సంతానముఁబొందుము" అని చెప్పినయభిప్రాయము నిక్లై వరుఁడు వధువునుగూర్చి "పుత్రకామవైయున్న నీ విఁకమీఁద నావ

లన సంతానము బడయుదుము'' అని చెప్పిన యభిప్రాయమును మన మంగీకరింపఁదగినవై యున్నవి. కాని వీనినాధారముఁ జేసికొని మనగుప్తగారు "మైమంత్రములనుబట్టి పూర్వగా రజస్వలలైనబాలికలకే వివాహము చేయవలయునని నిగమ మున్నది'' అని యిచ్చి నయభిప్రాయముమాత్రము సూత్రకారులయభిప్రాయమునకు గూఢమై యున్నదని చెప్ప వలసివచ్చినందులకుఁ జాలఁ జింతిల్లుచున్నారము. ఎందులకనెదరా? ఆపస్తంబమహర్షి యీరెండుమంత్రములను వివాహదీక్షయందలి నాలవనాఁటిరాత్రి "తంనగ్ధ్వా మపరరాత్ర, అని ప్రారంభించి...ఉత్తరాభ్యాం యథాలింగం మిథస్సమీక్షేయా" అనుసూత్రముతోఁ గుడిమెడములందు వధూవరులు గూర్చుండి యేకాంతముగా నొక్కసారి యన్యోన్యము చూచుకొనుటయందుమాత్రమే వినియోగమును జెప్పియున్నాఁడు కాని రజస్వలావివాహముఁ జేయుటయందు వినియోగము వ్రాసియుండలేదు. వారు వినియోగము చెప్పకున్ననేమి? ఆమంత్రార్థము రజస్వలావివాహమును జేయవలయునని బోధించుటలేదా? యనియడిగెదరేని నవి యిఁకమీఁద నావలన సంతానము గనుము" అని వధూవరు లొకరితో నొకరు చెప్పుకొనినట్లు చెప్పుచున్నవే కాని రజస్వలలైనబాలికలకు వివాహము జేయుమని విధించియుండలేదు. విధింపకపోయినను సంతానముఁగనఁదగిన ప్రాయములేనియెడ నావలన సంతానముగనుమని వధువు వరునిప్రార్థించినట్లు మంత్రము చెప్పుట యనుచితము కావున వివాహమునకు ముందుఁ గన్య రజస్వలయైయుండవలయునని యూహింపరాదా? యీయూహను నాలవనాఁటిరాత్రి నావెంటనే వధూవరుల నిద్దఱినిఁ గూర్చుండఁ బెట్టి గర్భాదాన సంస్కారము జరుపుట బలపఱచుచుండలేదా యని ప్రశ్నింపకపోరు. ఈవిషయము పూర్వాచారపరాయణులలోఁగూడ ననేకులను ననుమానసాగరమున ముంచివేయుచున్నది. కాన దీనినిగూర్చి ఇట్లు చర్చింపవలసియున్నది. నాలవనాఁటిరాత్రి గర్భాదాన సంస్కారము జరుపఁబడుచున్నదని మనసోదరులువచించిరి. కాని యీమాట యనుభవవిరుద్ధము. ఈగర్భాదానసంస్కార మైదవనాఁటి యపరరాత్రియందు నాకబలికాలమున జరుపఁబడుచున్నదికాని నాలవనాఁటిరాత్రి జరుపఁబడుటలేదు. ఐదవనాఁటిరాత్రి జరుపఁబడు నాకబలి తంత్రము గాని వివాహదీక్షాంగకర్మ గాదు. ఐనను గాకున్నను నపుడు గర్భాదానసంస్కారము జరుపఁబడుచున్నదని లంగీకరించితిరి కదా యని యందురా! అంగీకరించితిమికాని యది గృహ్యసూత్రమెఱుంగని పురోహితులచేఁగా

వింపఁబడుచున్నది. అంతమాత్రముచే నది విధివిహితమగునా కాదు. నాలవనాఁటి యుపరి వ్రాసిన ప్రథమప్రపాఠంములోని పదునొకండవఖండలోనున్న మొదటిరెండు మంత్రములచే మే మిదివఱకు వచించినట్లు వధూవరులేకాంతముగాఁ జూచికొనినపిమ్మట నొకమంత్రముతో నాజ్యశేషమును వరుఁడు వధూహృదయదేశమునందుఁ దగిలింపవలెనని చెప్పి మిగిలిన మూఁడుమంత్రములను జపింపవలసినదనివచించి యటుపై "శేషగుం సమావేశ నేజపేత్" అని చెప్పుచున్నాఁడు శేషమనఁగా అనువాకశేషము (పంద్రెండవఖండలోని యైదుమంత్రములను) సమావేశనకాలమందుఁ బఠించవలసినదని విశదీకరించియున్నవారు. కాని యైదవనాఁటిరాత్రి నాకబలిచేయుమనికాని యందు గర్భాధాన సంస్కారము జరుపుమనికాని గృహ్యసూత్రమునందుఁ జెప్పఁబడియుండలేదు.

ఇట్లనఁగనే మీరుచెప్పినరీతి నాలవనాటిరాత్రిరి "ప్రజాపతేతన్వం మే" మొదలగు మూఁడుమంత్రములను జపింపవలెనని తేలినదికదా. అవియైనను నప్పటికి వధువు గర్భాధానయోగ్యయై యుండవలెనని సూచించుటలేదాయనియందురా! సూచించునుగాని యాపస్తంబుఁడా వెంటనే వ్రాసిన సూత్రమాయభిప్రాయసూచనమును ఖండించుచున్నది. అదేమన? ఆమూఁడుమంత్రములను భర్తయే జపింపవలెనను నియమము లేదు. "అన్యోవైనామభిమంత్రయేత" ఇతరుఁడైనను నీవధువు నభిమంత్రింపవచ్చును. ఆనాఁడు క్రియారూపముగు గర్భాధానము జరుపుటయే సూత్రకర్తయభిప్రాయమగు నెడల నాపని యితరుఁడయినను జేయవచ్చునని చెప్పునా? దీనికి మనసోదరు లంగీకరింతురా? ఎబ్బె! యితరుఁడు గర్భాధానము జేయుట కంగీకరింపరందురా? అట్లయిననేమి సమాధానముచెప్పెదరు! నాలవనాఁటిరాత్రిఁ జేసెడియీజపముగర్భాధానమునుసూచించుటలేదని చెప్పితిరుదురు అపుడు వారియీయభిప్రాయముతో మన మేకీభవించుచున్నామని చెప్పనగును.

ఆ వెంటనేయున్న సూత్రము మనసోదరులవాదమును మూలచ్ఛేదముఁ జేయుచున్నది. అదేమన? "యదా మలవద్వాసాస్స్యా ద్దథైనాం బ్రాహ్మణప్రతిషిద్ధానికర్మాణి సఙ్కాశాస్తి యాం మలవద్వాససమిత్యేతాని" దీనికిసుదర్శనభాష్యము "అపియదేయం రజస్వలాస్యాత్ తదా పతిరేవైనాం బ్రాహ్మణప్రతిషిద్ధానికర్మాణి సంశాస్తి లౌకికభాషయైవ శిక్షయతి" ఎపుడు భార్య రజస్వలయగునో యపుడు పతియే యామెనుగూర్చి బ్రాహ్మణనిషేధములగుకర్మలను లౌకిక(దేశ)భాషచే లెస్సగా శాసించుచున్నాఁడు అనిదీనియర్థము. దీనింబట్టి వివాహానంతరమున భార్యరజస్వలయైనపుడు భర్త తాను

బ్రాహ్మణులకుఁ దగనిపనులను జేయఁగూడదని బోధింపవలసినట్లు తెలియవచ్చుచున్నది. ప్రథమ రజస్వలయగుటకుముందుఁ గన్యకకు వివాహమైయుండనియెడ నపుడు బ్రాహ్మణప్రతిషిద్ధములైన కర్మలను శాసింపవలసినభర్త యెవఁడు? ఉపభర్తయా! ఈవిషయమును మవసోదరు లంగీకరింతురా! అంగీకరింపరు. అంగీకరింపనిచో దీనికిసమాధానమేమి చెప్పుదురు? "వివాహానంతరమందు రజస్వలయైనపుడు భర్త బ్రాహ్మణప్రతిషిద్ధములగు కర్మలను శాసింపవలయునని యభిప్రాయముకాని యది ప్రథమరజస్వలయైనపుడనికాదు" అని సమాధానము చెప్పెదరా? వీరియభిప్రాయానుసారముగా ధర్మములను జెప్పునెడ సూత్రకర్త ముందు ప్రథమార్తవప్రకరణమును జెప్పి పిదప వివాహప్రకరణమును జెప్పియుండవలసినది. అట్లు చెప్పక యాపస్తంబమహర్షి ముందు వివాహప్రకరణమును, జెప్పి ముగించి యటుపై నార్తవప్రకరణమును బ్రారంభించుటచే నిదియే ప్రథమార్తవమని నిశ్చయించుకొనవలయునుగాని వేఱుగాఁ జెప్పినచోఁ బ్రకరణవిరోధదోషము సంభవించును. ఈయభిప్రాయము నావెంటనున్న "రజసఃప్రాదుర్భావాత్ స్నాతా మృతుసమావేశన ఉత్తరాభి రభిమంత్రయతే" అనుసూత్రము దృఢీకరించుచున్నది. ఇందులకు సుదర్శనాచార్యులు "రజసః శోణితస్య ప్రాదుర్భావాత్, కాలేనిర్గమాత్ప్రాగాత్ సమాలిన్యాదేః స్నాతాం పూర్వే త్రిరాత్రే స్నాతాం భార్యాం ఋతుసమావేశనే ఋతుకాలీన సమావేశనకాలే... ఉత్తరాభిః = విష్ణుర్యోనింకల్పయతు ఇత్యాదిభి స్త్రయోదశభి రభిమంత్రయతే॥ అని వ్యాఖ్యానముచేసియున్నారు. అనఁగా రజోవతియై మూఁడురాత్రులునిండిన వెనుక స్నానముచేసినభార్యను ఋతుసమావేశనకాలమునందుఁ దరువాతనున్న (పదుమూడవఖండ మొదలుకొని పదునాలుగవఖండలోని నాలుగుమంత్రములవఱకున్న) పదమూఁడు మంత్రములతో నభిమంత్రింపవలసినదని యర్థము. కన్యఋతుమతియగుటకుఁ బూర్వము వివాహముకానియెడ మూఁడురాత్రులువెళ్లినవెనుక స్నానముచేసినయాకన్యను నభిమంత్రింపవలసిన భర్తయెవఁడు? కానఁ గన్యలకు రజస్వలానంతరమున వివాహముజేయుట సూత్రవిహితమని మనసోదరులుచెప్పెడుమాట బూటకముల మూఁటయగుచున్నది. మీరుచెప్పినట్లు సమావేశనకాలములలోఁ జేయవలసిన జపమంత్రములను (గర్భాధానమంత్రములను) నైదవనాఁటిరాత్రి నాకబలికాలమున (బఠించుట సూత్రవిరుద్ధమైనప్పటికిఁ బామరులేకాక పండితులుగూడ నీయాచార మనుష్ఠించుటచేఁ బూర్వకాలమున నైదవనాఁడుగర్భాధానమొనరించెడియాచారమున్నట్లూహింపఁదగియున్నది. ఆయాచారమునకుఁ గన్యరజస్వలయైయుండుట యత్యవసరముకాదా?

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

2. రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమారి
జమీందారుగారు, గంపలగూడెం.

సహాయులు

15 తుమురుకోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

16 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు వాల్యూర్టు బదర్సుకం పెసి

17 సీకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమ్మిగిపురం

18 ఉల్లిగంటి వీర రాఘవరావుగారు, ముస్తాదారు, ఆనేపురం

29 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీల్ దారు జగిత్యాం

20 సాకుంట శంకరరావు దేశపాండ్యగారు జగిత్యాల

21 పట్టవర్ధనం సీతారామరావుగారు. వకీల్ .కంభంమెట్టు

## ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు

1 కిషన్ రావుగారు కరణము, అనంతవరము.

2 కాటూరు వెంకటకనకదుర్గాప్రసాదరావుగారు, కాటూరు.

3 రేశాల సుబ్బారాయుడుగారు జిల్లాకోర్టువకీలు, నెల్లూరు.

4 ముదిగొండ వీరమల్లావధానిగారు, నందిగామ,

5 చలివేంద్ర హనుమయ్యగారు, ద్రోణాదుల.

6 ముదిగొండ బసవయ్యగారు, ముక్త్యాల.

7 అమరవాది వెంకటనరసింహంగారు, గింజుపల్లె.

8 స్త్రీలా వీరయ్యగారి నరసయ్యగారు, నారసింహులుపేట.

9 గురువుల కృష్ణయ్యగారు, నారసింహులుపేట.

10 తిప్పరాజు సూర్యారావుగారు కరణము, నారసింహులుపేట.

11 వావిళ్ళ వేంకటేశశాస్త్రిగారు, మద్రాసు,

12 కలువలపల్లి రంగయ్యశాస్త్రిగారు, భాస్కరపంతులు, పేటుంగు.

13 ఆంధ్రభాషాభివర్ధని, ప్రొద్దుటూరు.

14 సరస్వతీసమాజము, సికింద్రాబాదు.

15 పుచ్చపట్టాభిరామయ్యగారు అసిస్టాంటుకరణం, తుమ్మలచెరువు.

# అభినవసరస్వతి

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొక మాసపత్రిక - ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును, ప్రకటింపబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనగలుగు నానందముగాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందా సంవత్సరమునకు రు 2-0-0

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము ... ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరణవీరభద్రకవి) ... ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ... ... | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండును నాటకములు ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) ... | 0-4-0 |
| 6 | నిరూపాత్మపీఠగురుపరంపర ... .. | 0-2-0 |
| 7 | నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము ... | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (సం॥ కృష్ణద్వైపాయనాచార్యులు వెంకటరామకృష్ణకవులయవధానములపై విమర్శనము) } ... | 0-5-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) ... | 0-4-0 |
| 11 | సంగదోషము (సంగదోషముచే బట్టుబడిలవడలనిగోగులచరిత్ర దెలుపు నొకచిన్న పద్యగ్రంథముగు కథ) } ... | 0-3-0 |
| 12 | వీరభాగవతము (ముదిగొండ వీరభద్రకవి) ... | 1-4-0 |
| 13 | పుళిందావివాహము (పత్రికాధిపతి) ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిరాకరణము, పిష్టపేషణము | 0-2-0 |
| 15 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) ... | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము (గాయనము వెంకటపతి) ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము (తిరుపతి వెంకటేశ్వరులు) ... | 0-3-0 |
| 18 | పశ్యంపుశ్యం ,, ... | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, ... | 0-2-0 |
| 21 | పురశ్చరణము ,, ... | 0-2-0 |

 వలయువారలు పోస్టుఖర్చులపిగాని వి. పి. ద్వారాగాని ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.